## 65 సం॥ వరుడు—16 సం॥ వధువు

ఎంత యవినీతికరమైనను, ఎంత ప్రకృతికి విరుద్ధమైనను, ఎంత ఘాతకమైనను, విజ్ఞాను లది ఎంత నికృష్టమైనదని, దుర్మార్గమని చెప్పినను కించిత్స్వార్థమునకై పశుప్రాయులై మానవు లితరులకు యావజ్జీవనరకము గల్గించు పనులను జేయ బూనుచునే యుందురు. మానవత్వము, దయాదాక్షిణ్యాది గుణములు—మరేమైన—వారిని అట్టి దుర్మార్గములనుండి వెనుకకు లాగజాలవు. ఈక్రింది యుదంతము దీనికి తార్కాణమైయున్నది. ఇట్టి పట్టుల నిట్టి మానవులపట్ల సంఘము చాల కఠినతవహించి నిష్కరుణముగ ప్రవర్తించిననేగాని ఫలితము గలుగనేరదు; అమాయకులై ఏపాప మెఱుగనివారలకు నరకయాతనలు నిలువవు; సంఘము మంచిస్థితికి రాజాలదు.

ధన్‌బాదు సమీపగ్రామమున నొక బ్రాహ్మణుడు గలడు. అతనికి 16 సం. వయస్సుగల కుమార్తె గలదు. బరద్వాజ్ సమీపగ్రామస్థుడొకడు 40 సం. ప్రాయమువాడనియు, ద్వితీయ వివాహమున కనియు మధ్యవర్తులు కన్యనడుగ నతడు తనకుమార్తె నాతనికిచ్చుట కంగీకరించెను. ముహూర్తము నిర్ణయింపబడెను. ఆనాటిరాత్రి వరుడు తన పరివారముతోగూడి యాడంబరముతో చనుదెంచెను. ముహూర్తసమయమున పెండ్లి పీటలమీదికి వచ్చిన వరుని జూడగా నతడు 40 సం.వాడు కాడు గాని 65 సం. తక్కువగాక తలంతయు తెల్లగనరసి, పండ్లజాడేమియు లేక పండుముసలిగా గనపడెను. వెంటనే వధూపక్షమువారందరా వివాహము జరుగరాదని యడ్డగించిరి. వధువుగూడ "మా తాతలాగనుండుట కర్హుడైన యాతనికిచ్చిన ఆత్మహత్య గావించుకొందు"నని చెప్పెను. దీనికి తగిన సమాధానము చెప్పక వరునిపక్షమువా రందరు తిన్నగ జారిపోయిరి. కాని తాతగారుమాత్రము వివాహముగునంతవఱకు కాచోటు గదలనని భీష్మించి కూర్చొనిరి. తుద కా వధువున కచటనే ఆతాత కనులయెదుటనే వివాహమయ్యెను గాని ఆ తాతకుగాదు.

వివాహమునకు గావలసిన పరికరములన్నియు సమకూర్పబడి, జరుగవలసిన విధులన్నియు జరిగి యుండినందున ఆ కన్యవివాహ మారాత్రియే నిలువక జరుగవలసియుండెను. అటనుండు కొందరు ముందంజవేసి అపూరుమంది బ్రాహ్మణులం దెవరైన వరుడు దొరకునేమోయని వెదుకజొచ్చిరి. వా రామెను వివాహమాడమని పెక్కుమంది యువకుల బ్రతిమాలిరిగాని యెవరును సాహసింపలేదు.

తుదకు వారు పగలంతయు పరీక్షలకు జదివి యలసి చాటప్రక్కనే చాపపై బరుండియున్న యొక విద్యార్థిని గన్గొనిరి. అత డా మరుసటి యుదయమున పరీక్షకు వెళ్లవలసియుండెను. వా రతనిలేపి తమ్ము వెంబడించమనిరి. అతడు దిగ్భ్రమజెంది తా నేమి చేయుచున్నదిగూడ దలంప నశక్తుడై వారిని వెంబడించెను. ఈలోపల ఆవిద్యార్థి తండ్రినిగూడ గన్గొని కుమారుని వివాహమున కనుమతి యివ్వవలసినదని బ్రతిమాలగా నతికష్టముపై నాతడందుల కంగీకరించెను. తుదకు వివాహము తెల్లవారుజామున గావింపబడెను. ఈ సమాచార మింతలో చుట్టుప్రక్కలవారందరికి దెలియుటవలన నచట జేరిరి. వీరందరు నూతన వధూవరులను ఊరంతయు మారేగించిరి. అంతవఱకుగూడ ఆతాత అచటనే కూర్చొని యాతంతు ఆమూలాగ్రముగా చూచుచునేయుండెను. కాని తరువాత జరిగిన వివాహపువిందులో నాతడు పాల్గొనెనో లేదో తెలియదు.

# ఇంటికి మించిన ఆదరణ—ఈవికిమించిన భోజనము

ఆంధ్రులరుచులను కనుగొని మృష్టాన్నమిడు ఆంధ్ర బ్రాహ్మణహోటలు బెంగుళూరులో నిదియొక్కటియే. ఈహోటలు యాభై వేలరూప్యముల మూలధనముతో యస్. జి. శాస్త్రిగారిచే స్థాపింపబడినది. నవీననాగరికత యేర్పాటులతో ఈ భవనము అలంకరించబడియున్నది. ఆంధ్రులకు కావలసిన పచ్చళ్లు, (గోంగూర చింతకాయ పచ్చళ్లు వగైరా) ముద్దపప్పు, వెన్నకాచిన నెయ్యి, ఆవకాయ, వేపుడు కూరలు మొదలగువాటితో భోజనము పెట్టబడును. భోజనము, రెండువేళల కాఫి ఫలహారములు గదితోకూడ దినముకు 2 రు. మొదలు రు. 5 వరకు రేట్లుగలవు. మరియు యిక్కడ ప్రతిపదార్థము వెన్నకాచిన నేయితోనే తయారుకాగలదు. క్రిందవివరించిన మిఠాయి దినుసులను చక్కని ప్యాకింగుతో రైలుపార్సిలు ద్వారాగా బైటవూర్లకు పంపబడును. శుభకార్యములకు ధరలు తగ్గించి యివ్వబడును.

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| తీపు | | | | బాదంపూరి | ,, | 1 | 9 | కాజా | ,, | 1 | 9 |
| గీవార్ | సీశె | 2 | 8 | సోహన్ పప్డీ | ,, | 1 | 9 | అక్బర్షా | ,, | 1 | 9 |
| చిరోటి | ,, | 2 | 8 | చంద్రకళా | ,, | 1 | 9 | కర్జిబలాషి | ,, | 1 | 9 |
| పేణీ | ,, | 2 | 8 | తార్ఫీజి | ,, | 1 | 9 | మోహన్ థాల్ | ,, | 2 | 8 |
| బాదంహల్వా | ,, | 2 | 8 | జామూన్ | ,, | 1 | 9 | | | | |
| సోహన్ హల్వా | ,, | 2 | 8 | దబ్రోట్ | ,, | 1 | 14 | కారము | | | |
| పిస్తాబర్ఫీ | ,, | 2 | 8 | బాసుంది | ,, | 1 | 14 | ఓంపుడి | ,, | 1 | 9 |
| బాదంబర్ఫీ | ,, | 2 | 8 | మైసూరుపాక్ | ,, | 2 | 8 | కారాసేవ్ | ,, | 1 | 9 |
| కేసరిపేడా | ,, | 2 | 8 | ,, సాదా | ,, | 1 | 9 | కారాబూంది | ,, | 1 | 9 |
| దూద్పేడా | ,, | 1 | 9 | జాంగీర్ | ,, | 1 | 4 | అటుకులు | ,, | 1 | 9 |
| ఖజ్జూర్ | ,, | 1 | 9 | జిలేబీ | ,, | 0 | 15 | మురుకు | ,, | 1 | 9 |
| బాదూషా | ,, | 1 | 9 | లాడు | ,, | 0 | 15 | పకోడా | ,, | 1 | 9 |
| బాసీలాడు | ,, | 1 | 9 | బూంది | ,, | 0 | 15 | ఉప్పేరి | ,, | 1 | 14 |
| రవాలాడు | ,, | 1 | 9 | పూరన్పూరి | ,, | 1 | 9 | గోడంబి | ,, | 1 | 14 |

ప్యాకింగు పోస్టేజి ప్రత్యేకము

కావలసిన వివరములకు వ్రాయుడు

## శాస్త్రి హోటల్ అండ్ రెస్టారెంట్

89 చిక్ పేట :: బెంగుళూరు సిటీ

# గ్రంథపరిచయము

**పల్లెపట్టు**

"పల్లెయే సర్వప్రపంచము, పంటపొలమే కామధేనువు, పత్నియే తన యిహపరమ్ముల భాగ్యదేవతగా" యెంచు భారతమాత ముద్దుబిడ్డడగు రైతును క్రమక్రమముగా నేఁడందరు కన్నెత్తి చూచుచున్నారు. రాజనీతిజ్ఞులగు నాయకులు, సంఘసంస్కారులగు నేతలు రైతువైపు తమ దృష్టుల పారించుచుండగా "రవిగాంచనిచో కవిగాంచు" నన్న కవికుమారుడు రైతుజీవితము తనకై కొక వస్తువుగా దీసికొనకుండజాలడు. కర్షక కుమారుని జీవితము కవికుమారుల కిటీవలనే పాడగట్టినది. అట్టి కవికుమారులలో నీ పుస్తకమును రచించిన చిరుమామిళ్ల విజయపార్థసారథిగా రొకరు. 'కల్మషంబును గాలదన్నిన కర్షకుల ప్రేమంపుజీవన'మును గేయము లందు కనులపండువుగ, మనోహరముగా వర్ణించినారు. ఇందుగల సీతారాముల జీవిత మాదర్శప్రాయమై యతిరమ్యముగ చిత్రింపబడినది. వారు "చీకు చింతాలేని ప్రాణులు, చెలిమికలుములు గలుగు జీవులు." భారతజాతీయప్రతిమలు.

కాని నేటిరైతున కింత యదృష్టము లేదు. కవిగారు వ్రాసినట్లు "నిర్భరం బతిదుర్భరంబౌ, గర్భదారిద్ర్యమ్ము పాలై, కూటికేడ్పై—గుడ్డకేడ్పై, నేటి రైతుండేడ్చె." దీని సంస్కరించి వారి శ్రేయోభివృద్ధికై పాటుపడిన గాని ఫలముండదు.

ఇందు ప్రకృతి రామణీయకమును వర్ణించు పట్టున పాత్రలను చిత్రించుచోట గ్రంథకర్త చాల నైపుణ్యమును జూపెననఁ జెల్లును. ఈ చిన్నిపొత్తము కర్షక జీవితమును జూపు మనోహరచిత్రము. 60 పేజీలు. ముద్రణాదులు చక్కగనున్నవి. వెల తెలియదు. వలయువారు చిరుమామిళ్ల విజయపార్థసారథిగారు, ముప్పాళ్ల, నందిగామ, కృష్ణాజిల్లా అని వ్రాయగలరు.

**నిజామురాష్ట్ర పరిపాలనము**

భారతదేశసంస్థానము లన్నిటి యందును మిన్నయై భాగ్యనగరమని పేరొందిన హైదరాబాదు రాష్ట్రపరిపాలనా విధులు క్లుప్తముగ నిందు వ్రాయబడినవి. ఆ రాష్ట్రీయులకేగాక ఆరాష్ట్రమును గురించి తెలియఁగోరు నితరులకుగూడ నిది సుపయోగముగా నుండగలదు. ఈ రాష్ట్రమునగల సంస్థానములు, వాని పరిపాలనము, నైజాము పూర్వచరిత్ర, రాష్ట్రవిభజనము, శాసనసభ, పరిపాలనమందుగల పలుశాఖలు వీనిని గురించిన వివరములు వ్రాయబడినవి. రాష్ట్రీయభాగములను, ముఖ్యపట్టణములను జూపు దేశపటముగూడ చేర్పబడినది. ఉర్దూపదము లితరులు సులభముగ గ్రహించు రీతి వానికి తెలుగు ఇంగ్లీషు సరియైన పదములును వ్రాయబడినవి. దీనిని సురవరము ప్రతాపరెడ్డి, బి.ఎ.,బి.ఎల్. గారు రచించిరి. గోల్కొండ ఆఫీసులో దొరుకును. గోల్కొండ చందాదారులకు 4 అణాలు. ఇతరులకు 6 అణాలు.

**వయోజనవిద్య**

ఈ కరపత్రమును ఆంధ్రపాఠక లోకమునకు చిరపరిచితులైన కనివారపు సుబ్బారావుగారు రచించిరి. ఇందు వయోజనులకు గ్రంథాలయములు సులభముగ విద్యనేర్పు పద్ధతులు వివరింపబడినవి. ప్రభుత్వమువారు చదువువచ్చిన ప్రతివారికి వోటు నిచ్చుటకు హక్కు నిచ్చియున్నారు. కావున ప్రభుత్వమువారితో సంబంధముండుటకు చదువు ముఖ్యసాధనముగనున్నది. దానిని వయోజనులకు గ్రంథాలయములే వ్యాప్తిజేయ చాల సాయపడును. ఈ కరపత్రమును వేటపాలెము సరస్వతీ నికేతనమువారు ప్రకటించిరి.

**శ్రీహరినాథావతారము** ఈ గ్రంథమును శ్రీ హరనాథతత్త్వ ప్రచారిణీ సభ, రాజమంద్రివారు ప్రకటించిరి. వెల 0-5-0.

కలికాలమున పరమాత్మని యవతారమనియు, ఆయనను గొల్చినవారికి మోక్ష మతిసులభమనియు శ్రీ హరనాథునిగూర్చి చాలమంది నమ్ముచున్నారు. కాని కొంతమందిమాత్రము ఆయన పరమాత్మని యవతారముగాదనియు, నందరివలె సామాన్య మానవుడనియు, ఆతని భక్తులాయనుగూర్చి చెప్పు విషయము లుత్ప్రేక్షలనియు వాదించుచున్నారు. ఈ వాదన ప్రతివాదములతో నిట ప్రసక్తిలేదు. ఈ పుస్తకమందు హరనాథబాబుగారియొక్కయు వారి సతీతిలకమగు కుసుమకుమారదేవిగారియొక్కయు పుట్టు పూర్వోత్తరము లాదిగాగలుగు విషయములు గలవు. వీరు భగవత్స్వరూపులని కావలసిన నిదర్శనములును, పెక్కుమంది అభిప్రాయములును ఇందు చేర్పబడినవి.

---

# పత్రికాపరిచయము

## గోష్ఠి

"శ్రీమదాంధ్ర విద్యాపీఠగోష్ఠివారి యాజమాన్యమున బ్రకటితమగు సచిత్ర వైజ్ఞానిక మాసపత్రిక. ఇందు ధర్మార్థమోక్షములకు సంబంధించిన సకలవిషయములును సరసముగను సమగ్రముగను చర్చింపబడును. ఆంధ్ర రత్న గోపాలకృష్ణ లీలలన్నియు నిందు ప్రదర్శింపబడును." గోష్ఠి మహోదాశయములు గమనింపదగినవై యున్నవి. ఇందుగల పద్యగద్యవ్యాసము లుద్రేకపూరితములై విశ్వమానవ సౌభ్రాత్రత మాశించునవై యున్నవి. అల్పకాలములోనే ఈగోష్ఠి ఆంధ్రుల గౌరవాదరణములబడసి యభివృద్ధియగుగాకయని యెంచుచున్నాము. సాలుచందా 1-8-0 రు. స్త్రీలకు, విద్యార్థులకు మాత్రము రు. 1-0-0. వలయువారు, మేనేజరు, గోష్ఠి, బెజవాడ అని వ్రాయగలరు.

## గోల్కొండ పదునొకండవ సంవత్సరాది సంచిక

పదునొకండవ సంవత్సరాదిసంచిక నందుకొనుటకు సంతసించుచున్నాము. నైజామురాష్ట్రమున గల ప్రముఖులగు ఆంధ్రుల చిత్రపటములచేతను, 'ప్రజాహితసమస్యలు, పశురక్షణము, స్త్రీసమస్య, సాంఘికసమస్యలు, కథలు, వాఙ్మయము, చరిత్ర,' మొదలగు 23 వ్యాసములచేతను నలరారుచున్నది. ఈ వ్యాసములన్నియు, ఆయా శాఖలందలి ప్రముఖులచేత వ్రాయబడినవి. వీనిలో నిరువురి స్త్రీలవ్యాసములు గూడ నుండుటయగాక, తంజావూరు రాజాస్థాన కవయిత్రులనుగురించి పరిశ్రమజేసి వ్రాసిన వ్యాసముగూడ గలదు. వీరు స్త్రీల కట్టిగౌరవము గల్గించినందులకు శ్లాఘనీయులై యున్నారు.

కలదు. అప్పుడు భారతదేశమునకు భారతనారీమణులకు స్వేచ్ఛకలుగును. ధర్మప్రేమాధిష్ఠానదేవియే సంపూర్ణస్వాతంత్ర్య మనుభవించు రాణి.

పాకల రాజమణెమ్మ (మదరాసు)

“కార్యేషుదాసీ” యను ముక్కను మాత్రమే తెలిసికొనిన కొందఱు పండితోత్తములు స్త్రీలు పట్టి దాసీత్వమునకుదక్క నన్యమునకు బనికిరారని సంసారసంబంధములగు నాదాయవ్యయములగూడ వారు ముచ్చటింపరాదనియు నథవా యేదేని చెలుపబోయిన “నాకు దాని కింత పెత్తన మెందుకు వంటయింటిలో పడియుండకుండ”నను పురుషు లీ నవనాగరికతా ప్రపంచమునగూడ నెందఱోయున్నారు. వారే నాలుగైదు తరగతులు లాంగ్లమును పఠియించినమాత్రముననే యపరశ్వేతముఖునివలె తయారగుదురు. అట్టివారి వాదములను పాటించుట యనవసరము.

“కరణేషుమంత్రి” యనునది చక్కగ నెఱింగియేయుండిన నైవాదమున కవకాశము లేకపోవుటయే కాక స్త్రీ కెట్టి స్వాతంత్ర్యలో యెట్టి మేధాశక్తిసంపన్నులో తెలిసికొనవగును. రాజ్యాంగమునకు మంత్రి కన్నుల వంటివాడు. మంత్రి యవినీతిపరుఁడైన రాజ్య మెట్లుండును? మనవారు గృహరాజ్యనిర్వహణమున భార్య యందు మంత్రిత్వము నుపపాదించియున్నారు. కావున స్త్రీలకు వా రెంతటి గౌరవాదరముల నొసగి యున్నారో తెలియనగును. రాజ్యాంగవిధానమును నడుపుటయందు మంత్రివరు బుద్ధికౌశలమే ప్రధానము కాని రాజు సాక్షి మాత్రుఁడే కదా! మంత్రులమాట సరకుసేయని నిరంకుశప్రభుపుమాట యటుండనిండు. గృహరాజ్యపరిపాలనమున భర్త భూభర్తయగుగాక. భార్య యాతనిరాజ్యమును నడుపుటలో మంత్రిగా నాతనిగూడి గములొనర్చుటకు దాసిగా నాతని సుఖింపఁజేయుటలో జతురతగల వేశ్యగా, భుజింపఁజేయు నపుడు ప్రాణంపుఁ బ్రాణమగు తల్లిగ నెన్నికష్టములనైన ధరించునపుడు భూమివలె శీలమును వదలక సర్వాలంకార సంశోభితయగు నవీనగృహలక్ష్మి వలెనుండు సాధ్వీమతల్లి సర్వస్వాతంత్ర్య కాదా?

ఇంతటి కార్యభారమును నెలతలతలపై నుంచవలెనన్న వారు పురుషులకంటె నెంతటి సమాలోచనా పరులో వా రెంతటి కుశాగ్రబుద్ధులో యనునది గమనించియేకదా పూర్వీకు లిట్టి నిరుపమాన స్వాతంత్ర్యము ననాదినుండి స్త్రీల కొసంగియుండుట. ఇక స్వాతంత్ర్యమన నెట్టిది? ఇంటియందు దమ పిల్లల వివాహవిషయ ములలోగాని మరియే యితర విషయములలోగాని భార్య యనుమతిలేనిదే పురుషుఁడు వర్తింపజాలునా? పాశ్చాత్యవనితలవలె స్త్రీపురుష లభేదముగ సంచరించుటయు వివాహాదులందు సంపూర్ణస్వేచ్ఛావిహారమును సనాతనధర్మవిరుద్ధములగుటచే భారతీయాంగనల కవి యాదర్శప్రాయములు కాజాలవు. మఱియు “లజ్జాతిరేకుల యువతయః పాతకంక్షాలయంతి” యను నార్యోక్తిచొప్పున లజ్జచేతనే కడుగబడిన నిఖిలపాతకలగు భారతీయవనితలు క్రీడావిహీనులై ప్రవర్తించిన పతితలగుదురు. పాశ్చాత్యాంగనల స్వాతంత్ర్యము మన యాచారవ్యవహారదూరములే కాక మన కనర్థదాయకములు.

ఒకవిషయమునందుమాత్రము స్త్రీలు నిజముగ నస్వతంత్రలు. అది ప్రయత్నించి సాధింపవలయును. ప్రకృతము హిందూవారసత్వమున పిత్రార్జితమునగాని, భర్త యార్జించిన విత్తమునందుగాని యతని యనంతరము పుత్రవతి కాని స్త్రీ యేయింతమంతయైనను పాల్గొన నోచికొనక భరణురాలు మాత్రమగుచున్నది. సంతానవతియైయుండినను పుత్రులు లేనియెడల భర్త యనంతర మతని యాస్తి సర్వస్వము, దానపూర్వకముగ వ్రాసియిచ్చినగాని చిల్లగవ్వయైన భార్యకు జెందదు. హిందూధర్మశాస్త్రమున సమష్టికుటుంబపు టాస్తుల సంక్రమణములో స్త్రీవారసత్వముగాని స్త్రీల కెట్టి సంపూర్ణానుభవ స్వాతంత్ర్యముగాని లేదు. తుదకు తల్లి స్త్రీధనములో నైతము దుహితలకే కొంచమోకాని పూర్తిగ లేదు. ఇట్టి లోటులను సవరింపవలెను స్వాతం

త్రమును మన స్త్రీలు సంపాదింపనగు. ఉభయభాషావిశారదలగు మన సోదరీమణులు సాధింపగలిగిన, స్వాతంత్ర్య మిది యనవచ్చును.

గంటి కృష్ణవేణమ్మ (బొంబాయి)

“ఏనాఁడు భారతస్త్రీ విద్యావతియయ్యెను, గర్వమెఱుంగక సహనాది సద్గుణమును గలదై యుండునో, ఏదినమున భారతనారి రైకమత్యముకలిగి పరస్త్రీపురుషుల నిజసోదరీసోదరులుగ భావించి సమిష్టి కుటుంబమునం దాదరభావము వహించునో, ఏనాఁడు భారతాంగన నిరాడంబరజీవనముగలదై యుండునో, ఏదినమున హిందూరమణి వినయశౌశీల్యైకమత్యములు కల్గి సీతాసావిత్రులభాతి నడచుకొనునో, ఆనాఁడే, ఆదినముననే భారతనారి పూర్వపుస్వేచ్ఛ, పూర్వపుగౌరవము బడయఁగలదు” అను అభిప్రాయమును మొందటి శ్రీమతి పా. చంద్రకాంతామణిగారు తెలియఁబఱచిరి. ఈ పైవాక్యములంగల భావములలో నిమిడియున్న అర్థమును వచింప నెంతేనిపట్టును. ఇప్పటివిద్యావతీ విద్యావంతలోకమంతయు పూర్వము మనవారు స్త్రీల కట్టి స్వాతంత్ర్యము నొసఁగలేదనియు, వారిని అబలలని తూలనాడినారనియు చెప్పుచున్నది. ఏమూల, ఏసభ విన్నను ఈమాటయే నిరంతరముగ మ్రోగుచున్నది. అట్టియిక్కాలమున చంద్రకాంతామణిగా రొక్కరు ‘పూర్వపుస్వేచ్ఛ స్త్రీ పడయవలయునన్న’ అను వాక్యములో పూర్వము స్త్రీలకు పరిపూర్ణస్వేచ్ఛయుండినది అని తెల్పినారు. నిజమా యిది? అయిన నెట్టిది? అను రెండంశములు విచారణీయములు.

పూర్వము స్త్రీలకు స్వేచ్ఛయు, గౌరవమును లేదు అనుమాట వట్టిది. స్త్రీ కట్టిస్వేచ్ఛ, గౌరవము పూర్వముండినదో అను విషయము సావిత్రీచంద్రమతీ సీతాదమయంతీ ప్రముఖ వనితామణి చారిత్ర్యమును సూక్ష్మదృష్టిం దడవినఁ దెలియవచ్చును. వారి కట్టి స్వేచ్ఛాగౌరవపదములు లేనిచో వారు పతివ్రతలై, పతిపాదాంబుజ మధుపాననిరంతరులై యుండఁజాలియుందురా? వచ్చిన కష్టముల సులువుగ దాటఁగల మెలఁపు వారి కెట్లబ్బినది? పతిసేవాప్రాభవగరి స్వేచ్ఛావిహారపరాయణలనియే ఘంటాపథముగఁ జాటిచెప్ప నొప్పునుగదా! తన కట్టి గౌరవము, స్వేచ్ఛయు లేకపోయిన చచ్చిన నాథుని యా మహాపతిపరాయణ—సావిత్రి బ్రదికింపఁజాలియుండునా? స్వేచ్ఛాగౌరవపదార్థభావ సంగత్యుపశోభితచారిత్రయగుటఁ బట్టియే గత ప్రాణుఁ,డనూజ, సప్రాణుంగా,రాజ్యవిహీను,నిజనాథు, రాజ్యారూఢుంగాఁ— బడయఁ జేర్చినది, నాథుహృత్స రోజాంతరావాసిని చంద్రమతి. “ఇఁక నన్నుదక్క రామునింగూడ లేవు—కానున్నఁ జన్నెదవీ చంద్రహాస ధారాపటిష్ఠతచే” అను రావణు జంకెనలకు అకలంకమతిరై, “చేయు మెట్టిపనినైనను; భయమా లేదు? శంకయా డాయఁజాలదు? ఆశయా మట్టుమీఱ నేలేదు?” అని నిష్ఠాగతవిస్పష్టహృదయముతో నెదిర్చి, దనుజనాథుని నిజనాథుబాణాగ్నిం గూలఁజేసిన సాధ్వీలోకశిరోభూషణము సీత యా స్వేచ్ఛాగౌరవపదములకు వెలిదైయుండెనదా? తను నట్టడవులఁ బాసిపోయినను ఆతఁడే భర్తయని నిరూఢము గావించికొని దేశాంతరవాసుని—నాథుని, ద్వితీయ స్వయంవరమిషచేఁ దెప్పించికొని, కొంతకాలము తనుఁ బాసియున్న అదృష్ట దేవతను దిరుగ వశవర్తిగాఁ జైకొనిన భర్తృపదపద్మపూజాలోలచిత్త—దమయంతికి స్వేచ్ఛలేదా? గౌరవ పదంబునకు దూరరైయున్నదా? స్త్రీ ప్రపంచ మునకు సహజంబుగ నొప్పియున్న గౌరవమే—స్వేచ్ఛయే—భరతఖండంబును, ఖండాంతరంబుల నఖండఖ్యాతిం గడింపం జేసినదని విస్పష్టములకెల్ల విశదంబగదా! స్త్రీ విషయక స్వేచ్ఛాగౌరవపదంబులు భారతదేశంబునఁ బూర్వము లేనిచో, సమస్తదేశంబులకు నీతిపాతివ్రత్యాదికసంపత్తిని పరదేశములకు మార్గదర్శినియైయుండెడిదా? పరపురుషుల—స్త్రీల, సోదరసోదరీభావములఁ బూజించుటకు భర్తలఁ దమకు మోక్షదాయకులుగా గణించి యనయమాత్మనిలయంబుల తన్మూర్తుల స్థాపించి, ధ్యానింపను, సేవింపను భారతనారీమణులు సర్వదా స్వేచ్ఛగలవారే.

పూల వేంకటసుబ్బమ్మ (తుంబూరు)




# టి. సి. యన్. గోల్డెన్ మెటల్

## జ్యూయలరి మార్టువారి

## వివిధరకముల గాజులు

ఈ గాజులు అచ్చంగా బంగారు గాజుల లాగే కాంతిలోనూ, వన్నెలోనూ మెరిసి పోతున్నాయి. నలుపు కావడములేదు.

2 సంవత్సరములు గ్యారంటి యిచ్చెదము

పెద్దసైజు గజాలు 2 యించిలు మొదలు
పైబడినది జత 1-కి రూ. 3 0 0

మధ్యమసైజు 1¾ ఇంచి మొదలు 2 ఇంచిలకు
లోగా వుండునది జత 1-కి రూ. 2 8 0

బేబీసైజు 1½ ఇంచుకు లోబడినది
జత 1-కి రూ. 2 0 0

వి. పి. ఖర్చులు జత మొదలు 6 జతలు
వరకు రూ. 0 6 0

గాజులకు ఆర్డరు చేయువారు వుపయోగించెడువాళ్ల గాజుల చుట్టుకొలతను ఇంకితో మార్కు చేసి పంపండి.

వలయువారు:—

## టి. సి. నాగలింగప్ప

## అండు కంపెని,

280, వాల్ టాక్సు రోడ్డు,
పార్కుటవున్ పోస్టు, మదరాసు.

కేట్లాగు ఉచితము.

ఏజంట్లు:—పటేలు స్టోర్సు,
మునిసిపల్ హైస్కూల్ రోడ్,
బెజవాడ.



# బొబ్బిలి బెబ్బులి

శ్రీమతి చర్ల సగ రాజకుమారిగారు
(విద్యానికేతనం)

[వెలమవీర కొదమసింగంబు, పాపారాయఁడు రాజాముకోటయందునున్న సమయంబున ప్రళయకాలంబును జ్ఞప్తిఁదెచ్చెడి బొబ్బిలి వెలమవీర సంఘమరణంబును మానరక్షణార్థమై స్త్రీల ఘోరమరణంబును ఆతనికిఁ దెలియవచ్చెను. అప్పటి ఆతని క్రోధ దుఃఖావేశభావములు.]

అరెరే! యెంతటి ఘోరకృత్య మవురా ఆంధ్రావనిన్ జేసినా
రరి భూనాథులు "వీరబొబ్బిలికి" కట్టా యెంతకష్టంబు వి
స్ఫురదభ్రంకష బాహువిక్రమలసద్భూర్యున్ మహావీరు భా
స్వర తేజఃపదవీనిధాను నను "పాపారాయు" నూహింపరే?
దరిలేనట్టితరిన్ గ్రహించి దయయున్ దాక్షిణ్యమున్ వీడి ని
ర్భర క్రోధాగ్ని వెలార్చిగాల్చితిరి పాపంబంచు పుణ్యంబటం
చు రవంతేనియు నెంచకుండ మనమందున్ శత్రురాడ్గర్వ భా
స్వర క్రోధాగ్నివిదగ్ధమానుడగు "పాపారాయు"డొప్పారగన్.

ప్రళయకాలాగ్ని చెలఁగి నిర్భయముతోడ
ప్రజ్వలించిన ఎదురుండు వారలెవరు?
ఈ వెలమ కేసరీంద్రమ్ము తావకీన
రుధిరధారలు గ్రోలక వదలునొక్కొ.
శత్రుమారణోత్సాహ ప్రజ్వలితక్రోధ
పూరితాగ్నిఛటులతోడ "బొబ్బిలి పులి"
వచ్చుచున్న దిదేరండు పౌరుషంబు
లున్నచో కాచుకొండింక ఓటుపడక.
ఇంతకునుమిమ్ము నిందింపనేల కాల
కర్మవశమును దప్పింపగలరె ఏరు?
సర్వసర్వంసహాస్థితి సర్వరాజ
పూజితాంఘ్రియుగళులగు బొబ్బిలినృప
కేసరులపాలి పెనుధూమకేతుగాక
జరుగునే? యింతటిమహాపదరహి వీర
బొబ్బిలీ! నేటి తోడ నీపూర్వ శౌర్య
లక్ష్ములంతరించెనుగ కాలవశమునను.



మిస్. ఉజ్రా ముంటాజ్

ఉదయశంకరుని నాట్యబృందమున చేరుటకై పాశ్చాత్య
దేశములకు వెడలిన మహమ్మదీయ యువతి.



బాందర్ వాలా

# పుష్ప చయము

## స్త్రీ సాహసము—ప్రతిక్రియ

వివాహము ముగిసినది. వధూవరు లిరువురు దస్కానుండి గూర్జనా వాలాకు ప్రయాణమైరి. వారితో గూడ నెవరును లేరు. మధ్య నందిపూరు సమీపమున, మార్గాయాసముదీర్చుకొన నొక్క చెట్టుక్రింద నూతన వధూవరులు విశ్రమించిరి. వధువుదప్పికొని యుండెను. వరుడు సమీపమందలి బావినుండి నీరుతెచ్చుటకై బైలుదేరెను.

బావిస్వంతదారు దచటనుండెను. బావినుండి నీరుదీసికొనుటకు సమీపమందేయున్న యొకగదినుండి కుండ నొకదానిని దీసికొనిరమ్మని వరునికి జెప్పెను. అపాత్రను దీసికొనుటకు వరుడు గదియందడుగిడెనో లేదో తత్క్షణ మాతని తల బావియజమానుని ఖడ్గమునకు గురియైక్రింద దొర్లెను. ఘోరము! వరుని శరీరముపైగల బంగారు ఆభరణము లాతని కాస్థితి గల్పించినవి.

పాపము! వధువు చెట్టుక్రిందనే అరగంటకాలము వేచియుండి భర్తతిరిగి రాకుండుటచే కారణము దెలిసికొనదలంచి బావివద్దకు వెళ్లెను. అచటలగవారామెకు ఆమెభర్త సమీపముననేయున్న గదియొద్దకు వెళ్లెననియు నచటినుండి తిరిగి రాలేదనియు జెప్పిరి. ఆమెకు సంశయముదోచి ఆగదిచెంతకు వెళ్లెను. భయంకరము! భర్తశరీరము నెత్తురులో దేలుచుండెను. వెంటనే ఆమె లోపలికివెళ్లి గదితలుపు గడియవైచెను.

బావి స్వంతదారుడామెను తలుపుతీయుమని గద్దించెను. కాని ఆమె మాటాడలేదు. అంతటవాడు గోడకు కన్నముపైచియుండుండి యొకని లోపలకు ప్రవేశపెట్టజూచెను. తనభర్తను ఆహుతిగొన్న కత్తినిదీసి యామెధైర్యముతో కన్నమునుండి తలలోనికిదూర్చిన వాని శిరమును శరీరమునుండి వేరుచేసి వానిశవమును లోనికీడ్చిపడవైచెను.

కొంతసేపటికి మొదటివానికి పట్టినగతి దెలియక యింకొకడా విధముగనే లోనప్రవేశింప నుపక్రమించెను గాని యామె సాహసముతో వానినిగూడ చంపి లోనికీడ్చివైచెను. తరువాత నామెకు ధైర్యమునడలెను. వెంటనే గొంతెత్తి యిలకల పాయమును వేడెను. పెక్కుమంది గ్రామస్థులూపోగైరి. పోలీసువారుకూడవచ్చిరి. ముప్పురి శవములను పరీక్షకై గూర్జాన్ వాలాకు దీసికొనివచ్చిరి. విచారణజరుగుచున్నది. చట్టమామె సాహసమునకు మెచ్చునోలేదోగాని ప్రపంచము మాత్రముమెచ్చి హర్షింపకపోదు.

## పెళ్లి పిచ్చి నావుతుందా ?

'ఫలానావారికి పెళ్లిపిచ్చి పట్టింది' అనుమాట అపుడపుడూ వినుచుందుము. కాని అది హాస్యముక్రింద పరిగణింపబడును. ఇటీవల ఫ్రాడ్ హామ్ విశ్వవిద్యాలయమున మానసికశాస్త్రసంఘమువారు పిచ్చికి పెళ్లికి సంబంధమున్నట్లు కనుగొన్నారని తెలియవచ్చుచున్నది. వారి ప్రకారము మనుషులకున్మాదము వచ్చునెడ వివాహమడ్డుపెట్టకపోయినను మానసికారోగ్యము చక్కబడుటకు చాల సాయముచేయును. వివాహము స్త్రీల

కంటె పురుషులకే విషయములో నెక్కుడుగ నుపకరించునట! అవివాహితులు, విడాకులుపుచ్చుకొన్న వారిలోనే పిచ్చివా రెక్కువగా బైలుదేరుదురు. ఈ విషయమై వారు అమెరికాసంయుక్తరాష్ట్రములందుగల ఉన్మాద వైద్యశాలలందున రోగులను పరీక్షింపగా తేలిన విషయములివి. అచటనున్న పిచ్చివారిలో చాలమంది విడాకులు పుచ్చుకొన్నవారును భార్యాభర్తలను పోగొట్టుకొన్నవారునైయుండిరి. అచటనున్నవారిలో వివాహితు లొకభాగము, భార్యగతించినవారు రెండుభాగములు, అవివాహితులు మూడుభాగములు, విడాకులపుచ్చుకొన్నవారు 4.5 భాగములుగానుండిరి. స్త్రీలలోకూడ కొంచమెచ్చుతక్కువగా నీరీతిగానుండిరి. వివాహితులలో పిచ్చి తక్కువగా నుండుట కారణములు రెండివ్వబడినవి. మొదటిది వారికి మానసికారోగ్యములేనపు డింటియందు శ్రద్ధగైకొనువారుందురు. సంసారములు లేనివారి కా సహాయములేదు. సంఘములోని పరిస్థితులకు, పరిసరములకు సరిపోవురీతి మెలగుట కలవాటుపడినవారే సాంసారికజీవితముల అంతరాయములేకుండ గడుపగలరు. వారొకవేళ వివాహమాడినను విడాకులు పుచ్చుకొని మనోబలిమిని గోల్పోవుదురు. ఇట్టివారే క్రమక్రమముగ ఉన్మాదవిద్యాలయముల నింపివేయు సూచనలు గలవట !

## అందరూ బి. యే.లై చేసేదేమిటి ?

“తరుణప్రాయం; రూపవతి; గౌరవమైన కుటుంబం; ఉన్నతవిద్యలను నేర్చెను. బి. ఏ., పరీక్షయందు గత సంవత్సరమే కృతకృత్యురాలైనది. ఇట్టి యువతికి తగినవరుడు కావలెను .......”

ఈరోజుల్లో ఏవార్తాపత్రిక చేతపుచ్చుకున్నా ఇలాంటి ప్రకటన ఏదోకంటికి కనుపించుతూనేవుంటుంది. ఇలాంటి ప్రకటన మొట్టమొదట చదవంగానే నవ్వు పట్టలేకపోతిని. ఎందుచేతంటే కళాశాలలో పట్టపరీక్ష యివ్వటం వివాహానికి అర్హతకలుగజేస్తుంది అనేభావం బాగా విచిత్రంగా తోచింది. కాని ఉత్తరక్షణాన్నే, ఆప్రకటనలోవున్న విషయం అంత పరిహసించతగింది కాదని నాకు తట్టింది. “భారతస్త్రీల విద్యాభ్యుదయాలకు” సంబంధించిన ప్రధానసమస్య అలాంటి ప్రకటనలలో ఇమిడివున్నదని నాకు తెలియవచ్చింది. మెట్రిక్యులేషనో లేక స్కూల్ ఫైనలుపరీక్ష యివ్వటంతోటే బాలికలు, తరువాత తాము ఏమిచదివితే ఏమి ప్రయోజనముంటుందో, తమజీవితానికి ఎలాంటివిద్య అవసరమో అనే జిజ్ఞాస ఏమాత్రమూలేకుండానే ఎకాయెకిని కళాశాలవిద్య చదువ మొదలెట్టుతారు. ఇప్పటికాలంలో విద్యనేర్చిన స్త్రీలంటే బి.ఏ. వరకో, ఎం.ఏ. వరకో చదివి ఒకపట్టం సంపాదించాలి. ఆ రెండు మూడేండ్లు ముగిసినతరువాత ఆకాస్తా సాంతంగా మరిచిపోయినప్పటికీ భౌతికశాస్త్రమో, రసాయనశాస్త్రమో, అర్థికశాస్త్రమో అభ్యసించాలి. చదువు ముగిసినతరువాత ఏదైనా వుద్యోగంచేతామని కళాశాలవిద్య చదివేవారు తక్కువ. కళాశాల వదలటంతోటే ఒకపురుషుణ్ణి కట్టుకొని, అంతటితో ఈ చదివిన శాస్త్రాలకంతా స్వస్తి చెప్పవలసివుంటుందని చాలామంది తెలిసేవుంటారు. హైస్కూలు చదువైన తరువాత వివాహమయ్యేంతవరకూ చేసేపని మరొకటిలేకనూ, కొంతవరకు జ్ఞానపిపాస తీర్చుకోటానికనిన్నీ ఈ కళాశాలవిద్య అభ్యసిస్తారు. బాలికల తలిదండ్రులైనా కళాశాలవిద్య చెప్పించటం వారికేదో వుద్యోగాలు లభించి, వారిని స్వతంత్రంగా జీవించేటట్టు చేయవలెనని కాదు; బి.ఏ. గాని యం.ఏ. గాని చదివితే వచ్చేభర్త గొప్ప చదువుగలవాడూ, పెద్దవుద్యోగంలో వుండేవాడూ, డబ్బుహోదావుండేవాడూ లభిస్తాడనే తలంపుచేతనే.

అంతేకాని, వివాహమైన తరువాత గృహస్థాశ్రమనిర్వహణానికి కళాశాలపరీక్షలు సహాయకారు లెంతవరకు అనే విమర్శలేదు. భారతదేశంలో అనేకంగా స్త్రీలు పతివ్రతధర్మాన్ని నిర్వర్తించటానికీ, సంతానాన్నికని చక్కగా పోషించటానికీ ముఖ్యంగా నేర్చివుండకతప్పదు. అటువంటి నిత్యకర్మానుష్ఠానానికి ఎచ్చటనూ అందుబాటులోలేని ఈ కళాశాలచదువంతా నిరర్థకమే కదా! వివాహానంతరం భార్యలుగానూ, తల్లులుగానూ అర్హతేములుగావుండాలి అని ప్రయత్నించినప్పటికీ, గృహస్థధర్మంవల్లా, బిడ్డలవల్లా, కలిగే ఆనందం, సంతృప్తి ఇలాంటివాటికి అంతకుముందే తిలోదకా లిచ్చివుంటారు. 'ఉమ' ఆ.ప.

## గులకరాళ్ల మాహాత్మ్యము—సంతానఫలము

మానవస్వభావము ప్రపంచమందంతట నొకేరీతిగ నుండుటచే, నాగరికులుగాని యనాగరికులుగాని కొన్నిటియందు మూఢవిశ్వాసము గల్గియుందురు. అవి కొన్నిచోట్ల ఫలించుటయు గలదు. దీనికి కారణము, వారి విశ్వాసమేగాని వారు నమ్ము విషయముగాదని విజ్ఞానులు గ్రహింపదగును. ఈ మూఢనమ్మకములు—సంతానవిషయమున—వివిధరీతులుగ నుండును. దినదినము కనులార జూచుచుందు మన కది క్రొత్తగాదు. కాని వీనినెల్ల మూఢవిశ్వాసములని గర్హించుచున్న పాశ్చాత్యులే వానినినమ్మటో మాత్రము మనకిది విచిత్రముగ గన్పడకపోదు. అందులకొక చిన్న ఉదాహరణము.

అమెరికా సంయుక్తరాష్ట్రములందలి అంటేరియోజిల్లా ఉత్తరభాగమున ప్రపంచమం దిదివఱకే ప్రసిద్ధికెక్కియున్న 'డయొనీ' శిశుపంచకము జనించిన ప్రాంతములందొక విధమగు గులకరాళ్లుగలవు. ఈ శిశుపంచకమింకకాన్పున కేగల్గి యిపుడారోగ్యముగ జీవించుచున్నారు. అందరు బాలికలే. వారిని సినిమాదీయుటకై కూడ ప్రయత్నించుచున్నారు. వీరైదుగురొకేమారు జన్మించిన ప్రదేశమున కొకవిధమగు మాహాత్మ్యమును పాశ్చాత్యులు గల్పించుచున్నారు. అందుచే ఆప్రదేశమునగల గులకరాళ్లు వివిధప్రాంతములకు సంతానము గలుగునను నమ్మకముచే కొనిపోబడుచున్నవి. అట్లు కొనిపోయిన కొందరికి సంతానముగూడ గల్గినదట! ఆరాళ్లకొరకై యిపుడు ఇంగ్లండునుండికూడ ఆర్డర్లు వచ్చుచున్నవట. ఒక్కొక్కరాతి నిపుడొక డాలరు కమ్ముచున్నారు. ఇంకను ధర యెక్కువజేయ దలంచియున్నారట! ఉపయోగమున్నను లేకున్నను పిచ్చినమ్మకములకు లోనగు మనుష్యులుండగా వారిని దోపుతీయుట కెంతమంది మహాత్ములు కాచుకొనియుండరు?

## అధ్యక్షునిపైన అర్ధాంగి అధికారము

ఇటీవల అమెరికా అధ్యక్షుడైన రూజువెల్టు సతిగారు కొంతమంది యువతులను తమయింటి కాహ్వానించిరి. వారు వచ్చినపుడు రూజువెల్టుగారే వారి కాతిథ్యమిచ్చిరి. అపుడాయన సతి కుమార్తె జన్మదినోత్సవము జరుపుటకు న్యూయార్కు వెళ్లియుండెను. వచ్చినవారు అధ్యక్షులఆదరణకు అతిథిసత్కారముల కచ్చెరువందుచుండగా వారిట్లనిరి "ఆమె అర్ధరాత్రి కిల్లుజేరుకొనును, అంతవఱకు మీకతిథిసత్కారములు చేయుట నావిధి. మిమ్ము సత్కరించమని ఆమె నాకొకచీటి వ్రాసిపోయినది. నాభార్యమాట నేను వినవలయునని మీరెఱిగియేయుందురు!"

# గ్రంథపరిచయము

**సీతాకళ్యాణము** — స్నేహలతాకవితా సంఘపుష్పము 50వదిగా, తత్సంఘాధ్యక్షులగు శ్రీ వాజపేయయాజుల రామసుబ్బారావు వేంకటనారాయణ సోదరకవులచే రచింపబడినది.

ఇయ్యది మూడాశ్వాసముల ప్రబంధము. కవిత్వపు పోకడ, రచనావిధానము, శైలినడక, వర్ణనావైశద్యమును యిది పూర్వప్రబంధముల ననుసరించున్నను యిందు నూతనవిషయములు గమనింపదగినవి గలవు. సాధారణముగా పూర్వప్రబంధములందు శృంగారమే ముఖ్యముగాఁగొని యసభ్యవర్ణలను జేయుచు, చర్వితచర్వణముగా వ్రాయుచుందురు. కాని యిది 'కళ్యాణ'మైనను అసభ్యశృంగారమునకు చోటివ్వలేదు. వర్ణనలు కూడ చాల సభ్యముగనున్నవి. ప్రబంధములనుండి పదభ్రోసిను పోవక పట్టుకొని యూగులాడుచుండు పుష్పలావిక, నాయకీనాయకులవిరహ వర్ణనలిందు గానరావు. రామలక్ష్మణులు విశ్వామిత్రుని వెంటబోవునపుడు పురస్త్రీలు, ఇతర ప్రబంధములందువలె గుడ్డలూడిపోవుచుండగా విచిత్రములైన యవస్థలబడుచు వచ్చి చూడక సాధారణముగనే చూచిరి.

ఇవి లేనందున దీనికి ప్రబంధలక్షణలోపము గల్గినదనజెల్లదు. శబ్ద అర్థాలంకారములతో గూడిన పద్యములు పెక్కుగలవు. అన్నిటికంటె చదువరుల నాకర్షించు భారతదేశవర్ణన పద్యము లారంభముననే గలవు. ఇది ప్రబంధరచనలో నూతనమయ్యు రమణీయముగనున్నది. కొన్నిచోట్ల మూలానుసరణముగు రచన గలదు. కాని ప్రబంధఫక్కి ననుసరించి గ్రంథము పెంచబడినది. వీరికవిత కుంటువడక చక్కగ సాగిపోవుచున్నది. శైలి మృదుమధురమై మనోహరముగ ద్రాక్షాపాకమున బడినది. ఈసోదరకవు లిరువురును విద్యావ్యాప్తికై కృషిచేయువారు, చేయించువారు. అందులకు వారిశిష్యుల గ్రంథములే నిదర్శనములు.

ఇట్టి సదుద్దేశ్యములతో, చక్కని కవిత్వముతో నొప్పు వీరు దేశాభ్యుదయమున కనుకూలించు రచనల గావించి ఆంధ్రమాత నలరింతురుగాక. పైగ్రంథము వెల రు. 1-0.0. వలయువారు, కొల్లాపురము, మొరవకొండ పోస్టు, కర్నూలుజిల్లా అని వ్రాసిన బడయగలరు.

**చైనాజాతీయోద్యమము. మొదటి, రెండవ, భాగములు.** — ఆంధ్రపాఠకలోకమునకు చిరపరిచితులగు శ్రీ అయ్యదేవర కాశేశ్వరరావుగారు రచించిరి. వివిధవిషయములలో ప్రత్యేక కృషిచేసి దేశచరిత్రలను, విజ్ఞానవిషయములను ఆంధ్రలోకమునకు పరిచయము గావించవలసిన యావశ్యకత యింకను తీరలేదు. ఇటువంటిగ్రంథములా కొరతను దీర్పగలవు. చైనాదేశము భారతదేశమునకు ప్రక్కనగలదే. భారతదేశమువలెనే స్వాతంత్ర్యసంపాదనకై నిరంతరము బాధపడుచుండునదే. నిజమునకు చైనా భారతదేశముకంటె నికృష్టకష్టములందున్నదనియే జెప్పదగును. పాశ్చాత్యులయొత్తిడి, జపానుదౌర్జన్యము, పైపెచ్చుగ అంతఃకలహములు—వీనిచే చైనాయభివృద్ధికట్టువడినది. ఈ కష్టముల నతిక్రమించి స్వాతంత్ర్యము సంపాదింప చైనాపడుచుండు కష్టము లీ గ్రంథములందు చక్కగ వర్ణింపబడినవి. ప్రతివారును చదువదగియున్నవి. ఈ పుస్తకములు జాతీయగ్రంథమాల 6, 7 కుసుమములుగా వెలువడినవి. ప్రతిభాగము వెల రు. 1-0-0 వలయువారు మేనేజరు, భారతనికేతనము, కాకినాడ అని వ్రాయుగలరు.

**రాధామాధవము** — పూర్వకవులచే రచింపబడిన యపూర్వరచన లెన్నియో కాలగర్భమున దాగియున్నవి. అట్టి అమూల్యప్రబంధరాజములలో నొక్కటియగు రాధామాధవ మింతవఱకు చక్కని ప్రచురణ బొందక

యుండెను. నేడా కొరత శ్రీ కపిలేశ్వరపు జమీందారులగు శ్రీ బులుసు బుచ్చిసర్వారాయులగారిచే తీర్పబడెను. దీని కాంధ్ర లోక మెంతయు కృతజ్ఞత జూపదగియున్నది.

రాధామాధవమును గుఱించికాని దాని రచించిన చింతలపూడి యెల్లనార్యుని గుఱించికాని ఆంధ్ర లోక మెఱుంగనిది గాదు. ఈకవి 'రాధమాధవ మచ్యుతాంకితము గాఁ బ్రౌఢప్రక్రియం జెప్పి, తన్మాధుర్యంబునఁ గృష్ణరాయవిభుఁ గర్ణాటేశు మెప్పించి, నానాధాత్రి ప్రతిమానసత్కవులలోనన్ భూషణశ్రేణితో రాధామాధవ నామమందిన జగత్ప్రఖ్యాతి'చారిత్రుడు. 'సరసులు చిత్తగింపుడని చాటను మామకవాణి సన్మనోహర యగునేని వారిహృదయంబుల కింపొనరింపక యున్నె' యని ప్రతినబూనిన యీతని కవితామాధుర్యమును జుఱ్ఱుటకీ నూతనప్రకటన ముత్సాహము గల్గించునని నమ్ముచున్నాము. విమర్శాదర్శక శ్రీ నడకుదుటి వీరరాజ ప్రణీతమై రసవంతమైన 48 పుటల మునిపలుకుగలదు. మంచి క్యాలికో బైండు, వెల 1-8-0. ప్రతులు ప్రకటనకర్తగారివద్ద దొరుకును.

**రాజధర్మప్రకాశిక** నైజాము సంస్థానమున జేరిన అమ్మపాలెం జమీందారులగు శ్రీ కాళ్లూరు జోగారాయ దీక్షితులుగారు సంస్కృతభాషయందు రచించిరి. దానికి తెనుగు తాత్పర్యము జేర్చి కాళ్లూరు రామకృష్ణరావుగారు ముద్రింపించిరి. ఈగ్రంథమును ప్రాచీన హైందవ నీతిధర్మశాస్త్రములోనుండెడు పద్ధతుల ననుసరించియు, ప్రస్తుత రాజకీయ హిందూ లా పరిస్థితుల బాగుగ విమర్శించియు నొక రాజ్యాంగ విధానమును సూచించుటకు రచించినట్లు గన్పడుచున్నది. ఇందు ప్రజోపయోగమగు కొన్ని నూతన పద్ధతుల నమలునందుంచుటకు సూచింపబడినది. వెల రు 2-0-0. వలయువారు కొండపల్లి గోపాలరావు దేశముఖ్, అని శెట్టిపల్లి, భద్రాచలంరోడ్డు రైల్వే స్టేషన్, ఎన్.ఎస్.ఆర్. అని వ్రాయవలయును.

**అరవిందదర్శనము** అరవింద దర్శనమున ఆ మహనీయుని దర్శించి నప్పటి సమాచారము లేమోయని కొంత మంది తలంపవచ్చును గాని ఈగ్రంథమందలి విషయము వేరు. ప్రతివారికిని 'ఈప్రపంచమేమి? అందు నేనెవరు? నాస్థితియేమి?' అను ప్రశ్న లుదయింపక పోవు. అనాదినుండియు వీనికి లెక్కకు మిక్కుటముగు సమాధానములు వచ్చుచున్నవి. వానినే దర్శనము లందురు. ఈప్రశ్నలకు శ్రీ అరవిందులవారి అనుభవపూర్వకమహాయోగ దార్శనికపద్ధతులు ఆంగ్లమునుండి యనువదింపబడినవి. అరవిందుల యోగస్వభావ మెఱుంగగోరు ప్రతివారును చదువదగినది. ఇది వేలూరి చంద్రశేఖరంగారిచే అనువదింపబడి- చతుర్వేదుల వేంకటకృష్ణయ్యగారిచే ప్రకటింపబడినది. 160 పుటలు. వెల ఒకరూరూపాయ. తపాలఖర్చు వేరు. ఆంధ్రపత్రికాలయమున దొరుకును.

**అరవిందజీవితము** ఆధ్యాత్మిక ప్రపంచమున దివ్యదీప్తులతో వెలుంగుచు, యోగతత్త్వపరిపూర్ణుడై ఆత్మానందోపలబ్ధికి త్రోవజూపుచున్న శ్రీ అరవిందయోగిని యెఱుంగనివారొక్క భారతదేశముననే గాక, నాగరిక ప్రపంచమునయెందును గానరారన్న వింతగాదు. అరవిందుని యోగాభ్యాసము, స్వదేశదీక్ష, స్వధర్మప్రచారము, పత్రికానిర్వహణము, నిర్బంధానుభవము, ఉద్యోగము, జ్ఞానోపార్జనము మొదలగు పెక్కువిషయములీ పుస్తకమునగలవు. ఇది ప్రతియాంధ్రుడును జదువవలసినగ్రంథము. అరవిందుల జీవితమును దెలుపు గ్రంథ మింతవఱకు యితర దేశభాషలందు నున్నట్లు గానరాదు. చక్కని అచ్చు. వెల ఒకరూపాయ. పోస్టేజి వేరు. దీనిని తు. కోదండరామయ్యగారు ప్రకటించిరి. ఆంధ్రపత్రికా కార్యాలయమున దొరుకును.

**ఆంధ్రవాచస్పత్యము** శ్రీ కొట్ర శ్యామలశాస్త్రిగారిచే (కరప) ప్రకటింపబడుచున్న ఆంధ్రవాచస్పత్యము 10, 11 వ భాగములు అందుకొనుటకు సంతసించుచున్నాము. 10 వ భాగమున (896 మొదలు 1000 పుటలవఱకు) 'కుశీలము' మొదలు 'క్షేత్రజ' వఱకును, 11 వ భాగము (1001 మొదలు 1096 పుటలవఱకు) 'క్షేత్రజుడు' మొదలుకొని 'గుఱుతులు' వఱకుగల పదములుగలవు. ప్రతి భాగము వెల 1-0-0.

# పత్రికాపరిచయము

## ప్రజావాణి

ప్రతిమంగళవారము శ్రీకాళహస్తినుండి వెలువడు జాతీయపత్రిక. సంపాదకులు శ్రీయుత పుల్లెల శ్యామసుందరరావుగారు. నిర్భయముగా, సత్యమును నిర్వహించుట వీరి యాదర్శము. మతముపేరిట జరుగు దురాచారములను, సంఘమునందలి యవకతవకలను, రాజకీయరంగమందలి యొడుదుడుకులను, నాయకుల తప్పత్రోవలను, ప్రభుత్వపు ఖరిని నిష్పక్షపాతబుద్ధితో విమర్శించుచు, ప్రజలకు సత్యమును దెల్పి వారిని వారి విధుల తెలియ మేల్కొల్పు పత్రికలే ఆంధ్రదేశమునకు గావలసియున్నవి. ఈ యాశయముల నెరవేర్చి యీ పత్రిక వృద్ధిలోనికి వచ్చునని నమ్మెదము. సంవత్సరము చందా రు. 2–8–0. విడిప్రతి 0–0–6.

## కళ

శ్రీయుత మొక్కపాటి నరసింహశాస్త్రిులగారి సంపాదకీయమున పిఠాపురమునుండి వెలువడిన [illegible] మాసపు 'కళ' సంచిక చేరినది. ఈ మాసపత్రిక ప్రతిమాసము 15వ తేది వెలువడును. సంవత్సర చందా రు. 1–8–0. విడిప్రతి 0-2-0. ఈ సంచికయందు చింతాదీక్షితు లాదిగా వ్యాసకర్తలవ్యాసములు చక్కగ నున్నవి. 'విజయగీతి' ఆంధ్రమాతస్వేచ్ఛ కుద్బోధించుచున్నది. ఈపత్రిక ఆంధ్రలోకముచే తగిన గౌరవమును త్వరలో పొందుగాకయని గోరుచున్నాము.

## ప్రతిభ

నవ్యసాహిత్య పరిషత్పత్రిక పక్షమున వెలువడు త్రైమాసిక మాసపత్రిక. శ్రీయుత తెలికిచెర్ల వెంకటరత్నంగారి సంపాదకత్వమున రాజమండ్రినుండి వెలువడుచున్నది. నవ్యసాహిత్యపరిషత్తుయొక్క ఆశయము లివి:—"నవ్యసాహిత్య రచనచేయుడము, నవ్యసాహిత్య మీదేశములో యేవిధముగా ఉత్పత్తి అవుతున్నదో పరిశీలించి అందులోని బాగోగులు విమర్శించడము, నవ్యవాఙ్మయముగురించి ఉన్న అపోహాలు తొలగించుటకూ, నవ్యసాహిత్యవ్యాపనముకోసమూ ప్రచారముచేయడము, వచనవాఙ్మయమూ, సాధ్యమైనంతవఱకును పద్య వాఙ్మయమున్ను, ప్రజలకు సుపరిచితమైన వ్యావహారికభాషలో నిర్మించి అందుమూలముగా ప్రజలలో విజ్ఞానము వ్యాపింపజేయుడమూ." ఈ ఆశయములెంతయు గమనింపదగినవి. ఇవి నెరవేరుగాకయని కోరుచున్నాము. ఈ సంచికయందుగల వ్యాసములన్నియు పైయాశయములకు నిదర్శనములుగానున్నవి. ఆంధ్ర భాషాప్రతిభను ఈ 'ప్రతిభ' వెల్లడించునని యాశింతుము. సంవత్సర చందా రు 2. విడిప్రతి 8 అణాలు.

---

# గమనింపు

రాబోవు అక్టోబరు మాసారంభమున యథాప్రకారము గృహలక్ష్మి దసరా సంచిక వెలువడును. దానిలో స్త్రీలచే మాత్రము రచియింపబడు వివిధవిషయములకు సంబంధించిన చక్కని పద్యగద్య వ్యాసములు ప్రకటింపబడును. దీని కాంధ్ర. విద్వత్సోదరీమణుల సాహాయ్య మత్యంతావశ్యకము. కావున సోదరీమణులెల్ల తమ పద్య గద్య వ్యాసములను సాధ్యమైనంత త్వరగా బంపి దసరా గృహలక్ష్మి సర్వాంగసుందరిగా వెలువడునట్లు తోడ్పడుదురని మనవి. రచయితలు తమ ఛాయాచిత్రములను గూడ పంప ప్రార్థన.

సంపాదకుడు.

## సులోచనములు

ఘట్టితనమునకును
సౌందర్యమునకును
సుప్రసిద్ధమైన చోటు



26 సంవత్సరములుగా పేర్గొని మహారాజులు, న్యాయాధిపతులు, డాక్టర్లు, జమీందార్లు వీర్లచే కొనియాడబడిన నమ్మకమైన స్థలము.

**RADHA BROS.,**
OPHTHALMIC OPTICIANS,
174, BROADWAY, MADRAS.



## మీ రెండు చర్మములను గురించి శ్రద్ధ వహించుము

ముడుతలకు గీరలకు కారణము క్రిందిచర్మమున గలదు. అచటగల తైలగ్రంథు లెండిపోయి క్రింది చర్మము క్రుంగి గీరలు ముడుతలు మొదలగునవి యేర్పడును. ఎండకెండి ధూళితో నిండి గఱుకైనది పై చర్మము. కావుననే రెండు చర్మములను గూర్చి ప్రత్యేక శ్రద్ధ దీసికొను టెందులకో తెలియగలవు.

**గీరలును మచ్చలను ముడుతలనుమాపును:**
ప్రతిరాత్రి పాండ్స్ కోల్డుక్రీమ్ పూసిన క్రింది చర్మమును బాగుగాజేసి నూతన శోభవచ్చును.

**గఱుకు చర్మము కూడ మాయును:**
ప్రతిరాత్రి పాండ్సు కోల్డుక్రీమ్ పాండ్సు వానిషింగ్ క్రీమ్‌తో కూడ పూసిన — ముఖమునకు మెడకు చేతులకు కూడ పూయుము — ఉదయమున చర్మము నూతనమై మృదువుగనుండును.

ఉచితము : దీనిని నేడే పంపి పాండ్సు రెండు క్రీములట్యూబులను పాండ్సు ఫేసుపౌడరు మాదిరులను ఉచితముగా బడయుడు. (చెక్ చేయుడు) నేచురల్.........రోజ్ క్రీమ్.........బ్రునెట్.......
డాడ్జి అండ్ సెయ్‌మర్ లిమిటెడ్,
3, వికెట్ రోడ్డు, బొంబాయి.
పేరు..................................
చిరునామా..........................No. GL. 4.

## తులసి, బిల్వ, వేప

ఇవి తులసి, బిల్వ, వేప అను జాతీయమూలికలను గూర్చి శాస్త్రవిషయక పరిశ్రమచేసి వ్రాయబడిన ఉత్తమ గ్రంథరాజములు. ఈ మూలికల ఓషధిగుణము, వైద్యప్రయోగములు, శాస్త్రచర్చ, పురాణవివరము సరళశైలిలో వివరింపబడినవి. వైద్యులకు, భక్తులకు మిక్కిలి ఉపయోగకరమైన గ్రంథములు. క్రౌను సైజాన మంచి ఫెదరువైటు కాగితముమీద ముద్రింపబడి గృహలక్ష్మి గ్రంథమాలలో ప్రథమ ద్వితీయ తృతీయ కుసుమములుగా ప్రచురింపబడినవి.

గ్రంథకర్త : కే. యస్. కేసరి ప్రతి 1-కి 0-8-0

గృహలక్ష్మి కార్యాలయము
పోస్టుబాక్సు నెం. 752, ఎగ్మూరు, మద్రాసు.



# సంపాదకీయములు

శ్రీమతి గోగినేని భారతీదేవిగారు—

జిల్లాబోర్డు సభ్యత్వము:

జాతీయసభ శాసనసభాప్రవేశ ముచిత మని యెపుడు తీర్మానించెనో, యపుడే స్థానికసంస్థలప్రవేశము గూడ స్థిరమయ్యెను. వానియం దధికారమెల్ల కాంగ్రెసువారికే యుండవలయుననెడి యుద్దేశ్యముతో ప్రముఖులు స్థానికసంస్థల యెన్నికలకు కాంగ్రెసువారినే నిలువబెట్టిరి. వా రన్నిచోట్ల జయశీలురగుదురను నమ్మకముతో నింతవఱకు కాంగ్రెసన్న గిట్టని వారుగూడ స్వార్థపరాశయములతో, కార్యసాధనోపాయమునకై కాంగ్రెసు ముద్రమాత్రము వైచికొని స్థానికసంస్థలందు ప్రవేశించిరి. దీనికితోడు కాంగ్రెసు స్థానికసంస్థలందు గావింపవలసిన కార్యక్రమమును గూర్చి యెట్టిప్రకటన చేయలేదు. అందుచే స్థానికసంస్థల యవస్థ ముందెట్టి పరిస్థితులందుండెనో నేడు గూడ నంతియయని చెప్పవచ్చును. ఇది శ్రీమతి గోగినేని భారతీదేవిగారు జిల్లాబోర్డు, ఎడ్యుకేషనల్‌బోర్డు సభ్యత్వమునకు రాజీనామానిచ్చిన విషయమందు స్పష్టమగుచున్నది.

శ్రీమతి భారతీదేవిగారు రాజీనామా నిచ్చుటకు రెండుప్రబలకారణము లున్నవన వచ్చును. మొటిది సర్ రెడ్డినాయుడు, రాఘవేంద్రరావుగార్ల నభినందించుచు ఒంగోలు జిల్లాబోర్డుసభలో తీర్మానములు గావించిరి. అవి కూడదని భారతీదేవిగారి వాదన. క్రాంగెసు స్థానికసంస్థలందు చేయవలసిన కార్యక్రమ మిదివఱకు ప్రకటింపబడకపోవుటచే నిది యిట్లగుట విచిత్రముగాదు. అదియునుగాక వారికి వ్యక్తిపరముగా, గల్గిన గౌరవమును అభినందించుట తప్పుగాదని మరికొంద రందురు. కాని శ్రీమతి కమలానెహ్రూగారిమృతికి సంతాపమును దెలుపు తీర్మానము ప్రవేశపెట్టనివ్వని కాంగ్రెసువాదులగు బోర్డుఅధ్యక్షులే యున్నారని భారతీదేవిగా రనుచున్నారు. వారికి రెండవ విషయముకంటె మొదటివిషయము ముఖ్యముగ గనపడుటకు హేతువేమియో? ఈవిషయమున తమతోడి సోదరికి దోచి నంతమాత్రము యుక్తాయుక్తము లితరుల మనముల కెక్కకుండుట చింత్యనీయము.

ఇక రెండవది. "గత 16 సంవత్సరములలో స్వార్థపరు లనుసరించినపద్ధతులనే ఇప్పటి స్థానికసంస్థలందున్న వా రనుసరించుచున్నారు. తమ బంధుమిత్రుల కుద్యోగములను సమకూర్చుటకు అధ్యక్షు లెక్కువ కృషి సల్పుచున్నారు. కాని గ్రామములోని ప్రజల కెక్కువలాభమును గల్గించుటకును

వారికి జాతీయాభిమానమును గలిగించుటకును జిల్లాబోర్డుల అధికారమును పలుకుబడిని వసతుల నుపయోగించుకొనుటకు తగినప్రయత్నము చేయలేదు." దీనికి వ్యతిరేకముగా నింకమీదటనైన చేయుదురని యాశ పెట్టుకొనుటకూడ నిరుపయోగమే. అట్టి పరిస్థితులలో తమ ధర్మమును, కాంగ్రెసు ఆశయములను గుర్తెఱిగి, వానిని అమలులో పెట్టుటకు వెనుదీయువారి మధ్యలో, ప్రజాహృదయమును తమ విధులను దెలిసిన యంతరాత్మగలవారుండ వలసిన యావశ్యకత యెంతేని గలదు. వారితోగూడి పనిజేయుచు, మేలుకీళ్లను గుర్తింపజేయుచున్న బాగుపడుటకు అవకాశ ముండునుగాని యెవరికివారైతే యుపయోగముండదనియే మా యభిప్రాయము. శ్రీమతి భారతీదేవిగారు రాజీనామా నిచ్చుటకుజూపిన కారణములు సహేతుకముగనున్నను, సభ్యత్వమునువీడక జాతీయసభాశయముల నెరవేర్ప పాటుబడిన బాగుండునేమో?

## భారత దేశ స్త్రీల బానిసత్వము

భారతీయులందరు దాస్యమునబడి క్రుంగుచుండు వారైయుండ భారతస్త్రీలుమాత్రము బానిసలనుటలో నర్థము లేకపోలేదు. మన దేశమున పురుషులను దాసులను జేయు నిగళబంధనములు వేరు; స్త్రీలను బానిసలగా జేయు నిర్బంధములు వేరు. పూర్వమునుండీ వచ్చుచు కాలదేశపాత్రలబట్టి మారక సంఘమున కుపకారమునకు బదులు అభివృద్ధి కాటంకములైన కొన్ని యాచారములు స్త్రీలను సంపూర్ణముగా దాసులను జేయుచుండుట సహృదయులెఱుగనిదిగాదు. ఇవి పురుషులకట్టి బాధాకరములుగావు, అభివృద్ధి కంతరాయము గల్గింపవు. ఈవిషయముపై నుపన్యసించుచు కలకత్తా రోటరీక్లబ్బునందు శ్రీమతి నీలిమాదేవిగారిట్లు బలికిరి. "విద్యాభివృద్ధి స్త్రీలోకమున సర్వసామాన్యముగా వ్యాప్తినొందుటలేదు. ప్రజాసామాన్యమం దింకను స్త్రీలు వృద్ధిలోనికి రాదగిన ప్రయోజకురాండ్రనెడి భావ ముదయింపలేదు. ఆడదైపుట్టుటకంటె అడవిలో మ్రానైపుట్టుటయే మేలనెడి విషాదభావమే స్త్రీలోకమును ఇంకను ఆవరించియున్నది. వారిది వ్యర్థజీవితమనియే తలంపబడుచున్నది. దానికి కారణమేమనగా వారికి కుటుంబములలోను సంఘములోను తగిన హక్కులును, గౌరవమర్యాదలును, అధికార స్వాతంత్ర్యములును లేకపోవుటయే. అందువల్ల ఇట్టి స్త్రీస్వాతంత్ర్య ప్రతిబంధకములను తొలగించునిమిత్తమై అనేక సంఘములును సభలును ఏర్పడి నారీలోకమునకొక నూతన ప్రబోధమును యిటీవల కొలది సంవత్సరములనుండియు సాగించుచున్నవి. స్త్రీలలో విద్యాభివృద్ధి గలిగినకొలదియు వారికి సంఘములో నేర్పడియున్న న్యూనత మరింత తలవంపులగుచున్నది. వారి దాస్యము వారి బానిసత్వము మరింత కనులకు కట్టినట్లు గనపడుచున్నది."

స్త్రీలు విద్యావతులైన గావచ్చును. పుట్టినవాటి దాస్యవాతావరణమున జెరిగిన వారైనందున వారికా వాసన గిట్టువదు, సదా నిమనకుంటుటకు సంఘము తగినరీతి శ్రద్ధవహించుచునేయుండును. దానినితిరస్కరించువారైనచో వారు సంఘములో మరింత నీచముగ నెన్నబడుదురు. సంఘము చెడిపోయినదందురు. విద్య విపరీతములుగూర్చునందురు. కాని వారికి విద్యతోటి తగిన గౌరవము యితరహక్కు లిచ్చినయెడల సంఘమెంత బాగుపడునో సనాతనాశయులు గమనింపగలరు. అంతియగాక విద్యయొక్కటియే స్త్రీల పురోవృద్ధికి దీసికొనరాజాలదు. సంఘములో వారియభివృద్ధి కాటంకములైయున్న యితరనిబంధనలు కూడ నడులాడవలయును. సనాతనులు సంఘమున పురుషులు మాత్రము కాదనీ స్త్రీలుకూడ గలరని యెప్పుడు జ్ఞాపకముంచుకున్న ఉత్తమము.

స్త్రీలోకము నుద్ధరింప బద్ధకంకణులైన సోదరీమణులుకూడ, ఉద్ధరింపబడ వలసిన వారు విద్యావంతులు మాత్రమేగారనీ, విద్యావిహీనులైన జనబాహుళ్యమని యెఱుగవలయును. ఇపుడున్న మహిళాసంఘోద్యమములన్నియు, సీలిమా దేవిగారు నుడివినట్లు "విద్యాధికురాండ్రగు స్త్రీలకుమాత్రమే. సామాన్యజన సంఘమందున్న స్త్రీలందరును యథాస్థితిలోనేయున్నారు. వారాత్మార్పణచేసిన బానిసలవలెనేయున్నారు. తాము కష్టములనుభవించుటకే పుట్టితిమని భావించుచున్నారు. ఇట్టి సామాన్య స్త్రీలోకము వృద్ధినొందుట కేదైన యుపాయము గపడదుగాని విద్యాధికురాండ్రైన కొలది మంది స్త్రీలు మాత్రమె వృద్ధినొందుటకు మార్గముగలదు. కొంతమంది తాము దేశసేవచేయు ప్రముఖురాండ్రమనిపించుకొనుటకు పత్రికలలో నార్భాటముగా ప్రకటించుచున్నారు. కాని జనసామాన్యమున వారుద్ధరించినదేమియు లేదు." పురుషులదికూడ నిదే ధోరణే. ప్రకృతము తమ గృహములందుగల స్త్రీలను వోటర్లుగా చేర్పించుటకు వీరెట్లు పాటుపడుచున్నారో తెలిసికొన్న వారు స్త్రీలయభివృద్ధికై యెట్టుల పాటుబడుచున్నారో స్పష్టమగును.

ఇదంతయు చక్కబడవలయునన్న సీలిమాదేవిగారు, "సాంఘిక దాస్యమును తొలగించెడి శాసనములు అమలునకు రావలయును, పూర్వాచారపరాయణుల నిరంకుశప్రాబల్యము రూపుమాపవలెను. సనాతన మూఢాచారవిశ్వాసమును తుదముట్టించుటవలననే స్త్రీలోకము ముద్ధరింపబడగలదు. అన్యథా శరణం నాస్తి' అనుచున్నారు గాని శాసనముల మూలముననే యిదంతయు చక్కబడునాయను సందేహము కూడ గలుగుచున్నది. ఇతర మార్గము లుపయోగపడక పోయినపు డింతకంటె యుత్తమమార్గము మరొకటిలేదు. కావున సంస్కరణాభిమానులందరు తగిన శాసనములను దేశమునందు ప్రవేశపెట్టుటకు ప్రయత్నింతురుగాక.

**హైదరాబాదు సినిమా అగ్నిప్రమాదము:**

జూను పదునాలవ తేది రాత్రి హైదరాబాదు (దక్కన్) నగరమున సుల్తాను బజారులోని మోతీమహాల్ సినిమాభవనము అగ్నికాహుతియై యందు పదునలుగురు మరణించిరి. వారిలో స్త్రీలుమాత్రము పదునొకండుమంది. వారందరు ఉన్నతకుటుంబములకు జెందినవారు. వారి కుటుంబములకు సానుభూతి నందజేయుచున్నాము.

మనదేశమున నేడున్నత కుటుంబములందు సినిమాలకు విసువక వెళ్లు అలవాటు దినదినము బలపడుచున్నది. సినిమాలు నానాటి కభివృద్ధిజెందుచున్నవి. మానవుల మానసముల సన్మార్గములందు ప్రవేశపెట్టి దేశాభ్యుదయము ఆదర్శముగాగొని చూపంబడు చిత్రములు చాలతక్కువ. ఈసమాచారమాబాలగోపాలమెఱింగియు కేవలము వినోదార్థమై సినిమాలకు వెళ్లుచున్నారు. అనవసరముగా వ్యయమగు ధనము, కావలసి తెచ్చుకొను అనారోగ్యము మొదలగు చెడుగులను సినిమాలకు వెళ్లువారు గమనింపకుండుట శోచనీయమన్నచో సినిమాలకు బోకుండుట మాయుద్దేశమని గ్రహింపకూడదు. దేనికిగాని మితముండవలయును; మంచిచెడ్డలను గుర్తింపవలయును; ఆదాయవ్యయముల లెక్కింపవలయును; ఆరోగ్యమును గూర్చి శ్రద్ధవహింపవలయును. సినిమాలకు వెళ్లు వారందరచటి యేర్పాట్లు తృప్తికరముగ లేవనియు, సినిమాలకు నిరంతరము వెళ్లుటవలన నష్టమేననియు వచింపకుండ నుండజాలరు.

హైదరాబాదునందు జరిగిన ఘోరమరణములు విన్నతరువాత శ్రీమతి దుల్హన్ పాషా బేగముగారు చెప్పిన విషయములు సోదరీమణులు ఆలోచింతురుగాక! "ప్రాచి ప్రాచియే; ప్రతీచి ప్రతీచియే; ప్రాచ్యులు పాశ్చాత్యులనన్నిటియం దనుకరింపబూనుట వినాశహేతువే! ఈ దురంతమునందు గతించిన వారొకరైన పురుషులు లేరు. స్త్రీలే బలియైరి. వీరంద రున్నత కుటుంబములకు జెందినవారే. ఇది మనవారెట్లు పాశ్చాత్యానుకరణ శీలురై సినిమాలవెంట పరువులిడుచున్నారో స్పష్టపరచుచున్నది. నేను వారిజాతికి చేరినదానగాన, వారిని సినిమాలపిచ్చినివీడి తగినపాఠమును దీనితరువాతనైన నేర్చుకొనుటకు హితవొసంగుచున్నాను."

**భారతమాత:**

ఈ సంచికయందు ముద్రింపబడియున్న భారతమాత త్రివర్ణచిత్రమును శ్రీయుత సి. ఎన్. వెంకట్రావుగారు చిత్రించిరి. భారతమాత ధరించిన దుస్తులు, వస్తువులు దేశముయొక్క సహజపరిస్థితులను చక్కగ వ్యక్తపరచుచున్నవి. ఈ చిత్రమున భావ, రూప సౌందర్యములు గలవు. ఈ యాంధ్ర చిత్రకారుని ప్రతిభ వృద్ధియగుగాక.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.